సంపుటము 2] డిసెంబరు 1915 [సంచిక 6

# బాలమిత్ర



## చిత్రనక్షత్రము

వృ॥ శో॥ జగముజాంగల వ్యోమవీథుల జానుగా వెలుగొందు శ్రీ
జగదధీశుని జన్మమోదము జాగరూకతనిచ్చుబల్
దిగులు మాన్పును తేజమిచ్చును తేరపారగజూడుడీ
మిగుల క్రిస్మసు సంతసంబులు మీకుకల్గును గాకిలన్

చాలాకాలముక్రిందట మన దేశములో నొక ముసలి బాపడు గలడు. ఆయన వచ్చిపోవు వారల చేతులు జూచి ముందునకు నీకు ఈగతి గలుగును ఆగతి గలుగును అని చెప్పుచుండువాడు. రాత్రులందు చుక్కలజూచి ముందునకు ఈ కార్యము జరుగును ఆ కార్యము జరుగును అని చెప్పువాడు. ఇట్లుండ నాతడొకరేయి చల్లనిగాలికై బైటపరుండి ఆకసంబు వంక జూచుచుండ నాతనికి చిత్రముగ వెల్గుచున్న ఒక చుక్క-కాన్పించెను. నాటిరేయి దానిగురించియే ధ్యానించుచు నిద్రించుచుండగా నొక స్వప్నము వచ్చెను. అందులో ఆ చుక్క యొక గొప్పరాజురాకను తెల్పుటకు వచ్చెననియు, ఆతడు ఆ రాజును చూచుటకు వెళ్లుమను హెచ్చరికయు ఆ దర్శనమున గలిగెను. అంత నాతడు ఆ ఉదయమే కొంత ద్రవ్యమును ప్రయాణమునకు ఆవశ్యకమైన వస్తువులను తీసుకొని ఒంటెపై నారోహించి పశ్చిమదిక్కుగా పయనమైపోవుచుండ నిద్దరు ఇతర ప్రయాణికులు మార్గమున పోవుట కాంచి, వారి సమీపించి, వారు కూడా తాను వెళ్లుచున్న పనిమీదనే వెళ్లుచున్నట్లు తెలిసుకొని, కడుసంతసించుచు, చుక్క వెళ్లుచున్న దారినే వారును సాగిపోయిరి. తుదకు వారు మనకు చాలదూరమునయున్న పలస్తీన యను ప్రదేశమునయున్న యూదయ్యాచేరి అచ్చటిరాజుతో కొంతతడవు

ముచ్చటించి అచ్చటి వేదశాస్త్రజ్ఞులద్వారా "యూదయ్యా దేశంబుననున్న బేతలేమను గ్రామమున నొక కన్యకు యేసు



అను బాలుడు జన్మించుననియు నతడే జగద్రక్షకుడనియు తెలుసుకొని ఆ గ్రామమునకువెళ్లి పొత్తి గుడ్డలలో జుట్టి యున్న ఆ చిట్టిబాలునిజూచి మిగుల సంతోషించి, యాతనికి సాగిలపడి మ్రొక్కి బంగారమును కానుకగా సమర్పించె

తక్కిన యిద్దరిలో నొకడు గ్రీసుదేశపువాడును మరియొకడు ఐగుప్తుదేశపువాడునై యుండెను. వారిరువురును బోళము సాంబ్రాణి ఆ ప్రభువునకు సమర్పించిరి."

చూచితిరా బాలమిత్రులారా! ఈ ముగ్గురు జ్ఞానులు ప్రభువును దర్శించి, ఆయనకు కానుకల సమర్పించిరి. శ్రీ దయానిధియగు సర్వేశ్వరుండు గతసంవత్సరమంతయు మనల సుఖంబుగ గాపాడి మరియొక క్రిస్మసు సమయము జూచు ప్రాప్తి యనుగ్రహించెను. ఇందులకు మనమెంతయు కృతజ్ఞత మన ప్రభువునకు జూపవలసినవారము. ఆ జ్ఞానులు అలనాడా కానుకల చెల్లించిరే నేడు నీవేమి నీ ప్రభువునకు చెల్లించనై యున్నావు? నీవు నిజముగా ప్రభువుని ప్రేమించితే కానుక చెల్లింపక మానవు. ప్రభువునకిచ్చు సర్వము తిరిగి మనకు వేవేలరెట్లు గావచ్చునని యొక కవి చెప్పినమాట లెంతయు వాస్తవము. నీ హృదయము, నీ బలము, నీ జ్ఞానము, నీ కాలము, నీ ధనము, నీకుగల సర్వ వరములను ప్రభువునకు చెల్లించుము. అంత ప్రభువు నిన్ను ఆశీర్వదించును.

జ్ఞానులారాధించిరి – యేసు ప్రభువుని – పూని
పాపుల బ్రోవ మేను దాల్చినతరి || జ్ఞాను ||

1. ఆవిధముగమన – మారాధించుదము
పావననామము – బ్రస్తుతించుదము – జీవ
నము – పరమావనము – మన – దేవావతారంబు || జ్ఞాను ||

# ప్రేమయొక్క శక్తి

పూర్వము ఒక పట్టణమునందు ఒక చిన్నది కలదు. అది తల్లిదండ్రులు గాని, స్నేహితురాండ్రు గాని లేక దిక్కుమాలి, నడివీధిని కూర్చుండి యేడ్చుచుండెను. అట్లు యేడ్చుచున్న యా చిన్నదానిని చూచి, ఒక యాడుది, ఏల యీలాగు వీధిని కూర్చుండి యేడ్చుచున్నావు అని యడిగెను. అందుకా చిన్నది, నేను పూర్వజన్మమున చేసికొన్న పాపముచేత తల్లిదండ్రులు మొదలగువారు ఎవరునులేక దిక్కులేనిదాన నైతినే యని యేడ్చుచున్నాను అని బదులుత్తరము చెప్పి, తలవంచుకొని యేడువసాగెను. ఆలాగు ఏడ్చుచున్న యా చిన్నదానిని చూచి యా యాడుది, అయ్యో పాపము ఇటువంటి దిక్కులేని పేదచిన్నదానిని కాపాడినగదా, విశేష పుణ్యము కలుగునని యోచించి, దానినిపిలిచి అమ్మీ యేడువకుము మా యింటికి పోదాము రమ్ము అని చెప్పి బుజ్జగించి తన యింటికి పిలుచుకొని పోయెను. అట్లు బుజ్జగించి యాపె పిలుచుకొని పోయినను ఆ చిన్నది పూర్వజన్మమున చేసుకొన్న పాపకర్మము చేత గదా తల్లిదండ్రులులేక ఇట్లు పరులపంచలలో పాకవలసి వచ్చెను అని ఎప్పుడుచూచినను యేడ్చుచునే యుండెను.

దీనిని కాపాడవలయునని పిలుచుకొని పోయిన ఇల్లాలికి ముగ్గురు కొమార్తెలు గలరు. వారు ముగ్గురును ఈ యేడ్చుచున్న చిన్నదానిని చూచి దీనిని ఏడువనీయక యేలాగుననయినను దీని దుఃఖముపోగొట్టి ఆటలాడుటకుగాను ఎంతో బలవంతముచేసి పిలిచినను పోక యా చిన్నది యూరక ఏడ్చుచు కూర్చుండి యుండెను. దయాళువైన యా యాడుది ఆ పేద చిన్నదానిని చూచి "ఇదిగో ఇక్కడ రహస్యమైన యొక మంత్రమున్నది. ఆ మంత్రము నీవు ఎక్కడికి పోవలయునని తలతువో అక్కడికి నిన్ను పిలుచుకొని పోవును. ఆ రహస్యమైన మంత్రము రెండక్షరముల మాటలో నిమిడి యున్నది. నీవు దానిని తెలిసికోవలయునని కోరిన నా కొమార్తెలను ఈ ముగ్గురని అడిగితివేని చెప్పుదురు. వారి దగ్గఱ తెలిసికొనుము" అని చెప్పెను. పిమ్మట ముగ్గురు కూతులును యా రహస్యమైన రెండక్షర మంత్రమేది యని యోచించి కొంతసేపటికి అది మిక్కిలి సొగసైన ఆటగా నుండునని ఎంచుకొనిరి. అందు పెద్దదియైన నీలవేణి ఏడ్చుచున్న చిన్నదానిని పిలిచి, అమ్మీ! ఆ రహస్యమైన రెండక్షరముల మంత్రము "బొమ్మ" అని చెప్పి నేనొక బొమ్మను చేయుచున్నాను. అది నీకు కావలసి యుండెనేని నాదగ్గఱకు రమ్ము ఇచ్చెదను అని చెప్పుచు, ఎంత పిలిచినను ఆట

లాండరాని యీ చిన్నదానిని బొమ్మ యేమిచేయుననని తనలో తాను యోచించుచుండెను. రెండవదియైన శారికవేణి అది కాదు; "పండు" అనునదియే రెండక్షరములుగల మంత్రముగా నుండును అని యోచించి యొక పండును తెచ్చి తనచేత పట్టుకొని ఆ చిన్నదానికి చూపెను. ఆ చిన్నది దానిని చూచి తలను గిఱ్ఱున త్రిప్పివేసెను గాని యేడ్పుమాని దగ్గఱకు రాలేదు. బాలామణి యను పేరుగల మూడవ చిన్నది ఆ రహస్యమైన రెండక్షరములుగల మంత్రమేది యని కొంతసేపు యోచించి తెలిసికొని "ఈ మంత్రమును ఆ చిన్నదానికి చెప్పకపోయిన ఈ మంత్రముమీద మక్కువచేత అది మనకు తెలియకపోయెనే" యని విచారపడునని యెంచి క్రిందకూర్చుండి యేడ్చుచున్న యా బీదచిన్నదాని దగ్గఱకు పోయి దాని ప్రక్కన కూర్చుండి తనచేతులతో దాని దేహమంతయు నిమురుచు తానును ఏడవసాగెను. అలాగు కొంత సేపు ఏడ్చి తిన్నని మాటలతో అమ్మీ "నీకేమి యిక్కడ తక్కువ నీమీద మేమందరము ప్రేమగలిగి యున్నారము; నీవు ఏడువక యుండుము" అని చెప్పుచు దానిని కౌగిలించుకొని తన చేతులతో దానితలను పైకెత్తి ముద్దుపెట్టుకొనెను. అంతట ఆ బీదచిన్నది ఏడ్పు చాలించి బాలామణి మొగము చాయచూచి కన్నులనీళ్లు తుడుచుకొని నీవు ఎక్కడికి రమ్మనె

దవు అక్కడికి పోదము రమ్మని చెప్పెను. అందులకు బాలా మణి సంతోషించి దాని చేయిపట్టుకొని ఆటలాడుటకు పిలుచుకొని పోయెను. మొదట ఆ చిన్నదానిని ఆదరించి తమ యింటికి పిలుచుకవచ్చిన యిల్లాలును తన యిద్దరు పెద్దకొమార్తెలను చూచి మీ చెల్లెలయిన బాలామణి నేను చెప్పిన రెండక్షరముల మంత్రమును తెలిసికొనెను. అది యేదనగా ప్రేమ అను రెండక్షరములుగల మాట. ఈ లోకమున అన్ని జంతువులయందును ప్రేమకలిగి యున్నపక్షమున సమస్త కార్యములును ఫలించును దీనిని చదువు సోదరీ మణులారా! మనము సమస్తవాటిపైన ప్రేమయుండేటట్టు నేర్చుకొందుముగాక.

---

# రాజాభిమాన కీర్తన

రాగము

నే నేమని తెల్పుదు (లేక) చాలో ప్రియనేస్తమా వలెనే

శ్రీ మైదవజార్జికి – శ్రేయంబులిడుము ॥ శ్రీ ॥

1. మాదగు రాజ్యము – మానుగ నేలను =
నీదుదయా రస – మొసగుమయా దేవా ॥ శ్రీ ॥



2. మేరిరాణెమ్మకు - వారి బిడ్డలకును =
కూరిమిసంపద - లీయుమో దేవా ॥ శ్రీ ॥

3. రాజప్రతినిధులకు - రాజ్యాధికారులకు =
పూజితముగనిల - బ్రోవుమయా దేవా ॥ శ్రీ ॥

4. అతిఘనులగు మా - ఆంగ్లేయులకు =
సతతము దీవన లిడుమయ్యా దేవా ॥ శ్రీ ॥

5. రైలును కంకరరోడ్లను - మొదలగు =
మేలులనొసగిన - జాలిప్రభువులగు ॥ శ్రీ ॥

6. నూతనెడ్యూకేషన్ - వేతనముల కృషిన్ =
భ్రాంతిగనొసగిన - ప్రభువులగు మహా ॥ శ్రీ ॥
7. తన జనబాధను - తన బాధనుగా =
దనరదలంచుచు - తాల్మినొసంగెడు ॥ శ్రీ ॥
8. హిందూరాజ్యము - పొందుగనేలను =
గ్రందుననీయుము - కరుణసంపద ॥ శ్రీ ॥

---

# ప్రకృతి పాఠములు

## 17-వ పాఠము

### కఱ్ఱ

పోయిన పాఠములో చెట్టుబోదెకును కొమ్మలకు పైనుండు పట్టనుగూర్చి నేర్చుకొంటిమి. బోదెలోపల ఇంకను రెండుభాగము లున్నవి. వానిలో పట్టకు తరువా తది కఱ్ఱ భాగము. దీనికే కాష్ఠము అని పేరు. అన్నిటికంటె యిది మిగుల ముఖ్యమైనది. ఇది పట్టచేత ఏర్పడును. పట్టలో జీవించుభాగ మొకటి కలదని నేర్చుకొంటిమి గదా. దాని లోని రసమువలననే కఱ్ఱభాగము చేయబడును. పట్టచేయు

పనివలననే, సంవత్సరములు గతించినకొలది చెట్టుయొక్క బోదెయు, కొమ్మలును వృద్ధియై లావగుచున్నవి. సంవత్సరమగునప్పటికి క్రొత్త కఱ్ఱపొర యొకటి పట్టకు సమీపమున పెరుగుచుండును. ప్రతి సంవత్సరము ఏర్పడిన పొరలను బాగుగా చూడవచ్చును. ఒక బోదెను అడ్డముగా కోసి చూచినయెడల యివి బాగుగా కనుబడును. కొన్నిమారులు విని లెక్కించి ఆ చెట్టున కెంత ప్రాయమో చెప్పగలిగినంత స్పష్టముగా నివి కనుబడును. ఇక్కడ కనుపర్చబడిన, 1-వ పటములో బోదెలోని కఱ్ఱపొరలను చూడవచ్చును.

ఈ కొయ్యభాగ మంతయు సన్ననిగొట్టములలో నిండియున్నది. వీనిగుండా రసము చెట్లయొక్క కొనకొమ్మలకును రెమ్మలకును బోవును. ఎంత ఎత్తుగల చెట్టయినను రసము ఎక్కును. ఇది చాల చిత్రమైన సంగతి. 2-వ. పటములో అట్టి గొట్టముల రూపము కనుబడుచున్నది.



1. బోదె అడ్డచీలిక

కొయ్యభాగములోని గొట్టముల గుండా రసమెట్లు భూమినుండి పై కెక్కునో మనకు తెలియదు. అంత ఎత్తునకు నీరు

పంపవలెనంటె, యంత్రబలముచేతనే చేయవలెను. గాని యిట్టి యంత్రమేదియు చెట్టునందు కనుపడుటలేదు. ఈ గొట్టము, చెట్టు వ్రేళ్లనుండి ఆకులవరకు మాత్రము వెళ్లుచున్నట్లు మనకు తెలియును. ఒక పెద్దచెట్టును చూచినప్పుడు దానినిండ ఎన్నిగొట్టము లున్నవో యని ఆలోచించుము. అంత పెద్దచెట్టు ఆకులను పచ్చగానుంచి చెట్టు ఎండకుండ చేయుట కెంతరస మీ గొట్టముల గుండా వెళ్లవలెనో తలంచుము. అదంతయు ఒకటే గొట్టము గుండా పోవుచున్నయెడల పెద్దకాలువవలె నుండును.


2. బోద నిడుపుచీలిక

పెద్దమొద్దును చూచినయెడల దానిలో రెండు రకముల కఱ్ఱ కనుపడును. మధ్యనుండునది చేవ యనబడును. కొన్ని వృక్షముల చేవ చాల గట్టిది. పై పొరలు పెరుగుచున్నందున మధ్యనున్నవి అదుమబడి చాల దృఢమైనవగును. ఇట్టి చేవతో పూర్వీకులు, లోహముల ఉపయోగము తెలియక మునుపు, త్రవ్వటకును, నరకుటకును పనిముట్లు చేసికొనిరి.

# క్రిస్మస్ కీర్తన



దీనిని బాలికలు కోలాటము వేయుచు పాడినయెడల

మిక్కిలి వినోదముగ నుండును

రా॥ నాథనామక్రియ — తా॥ ఏకతాళము

బాలలారా రండిమనకు - జాలదయ నొసంగెతండ్రి =
కోలహాలము జేయ గూడుడీ - ప్రియ బాలలార =
కోలుకోలటంచు బాడుడీ ॥ బాల ॥

1. బేదలేమయూర క్రీస్తు - నాథుడు జన్మించె నేడు =
బోదమదిగో గొల్లవారితో - ప్రియ బాలలార =
మోదమంది మనుదమతనితో ॥ బాల ॥

2. జ్ఞానులదిగో వచ్చినారు - కానుక లర్పించినారు =
గానములతో మ్రొక్కినారుగ - ప్రియబాలలార =
మానసమున నమ్మినారుగ ॥ బాల ॥
3. హేరోదనెడి పెద్దరాజు - యేసుజంప వెదకెనపుడు =
అయిగుప్తుకు బారిపోయెగ - ప్రియబాలలార =
నచట గొంతకాలముండెగ ॥ బాల ॥
4. మళ్లి నాజరేతుకరిగె - చెల్లిపోయె ముప్పదేడు =
ఎల్లవారి దయను పడసెగ - ప్రియబాలలార =
తల్లి యిల్లు విడిచిపెట్టెగ ॥ బాల ॥
5. నీతిమీరక యోహాను - చేత యోర్దానునదిలో =
ఖ్యాతిమీర స్నానమొందెగ - ప్రియబాలలార =
సాతానుని శోధన జయించెగ ॥ బాల ॥
6. అంతటను సంచరించి - వింతకార్యములను జేసి =
చింతలెల్ల బాపినాడహా - ప్రియబాలలార =
ఎంతగొప్ప వాడితండహా ॥ బాల ॥
7. మనకు ముక్తిగలుగునట్లు - మరణమాయె సిలువపైని =
మరల త్రిదివసంబునందున - ప్రియబాలలార =
పునరుత్థానుడాయె పొందుగ ॥ బాల ॥
8. ఇతడె మనకు రక్షకుండు - ఇతడె జగద్రక్షకుండు =
ఇతడె యిహ పరాలకాధార - ప్రియబాలలార =
ఇతని నాశ్రయించుడీ సదా ॥ బా

# బాలమిత్ర టపా



ప్రియ బాలమిత్రులారా!

అరేబియా దేశములో ఒకడు యొక ఒంటెను పెంచుకొనుచు దానివలన వ్యాపారము చేయుచు ధనమార్జించుచుండెను. ఇతడు దానియందు ప్రేమగలిగియుండెను.

శీతాకాలములో ఒకనాడితడు తన గుడారములో పడుకొని, బయిట తన యొంటెను గట్టిపెట్టియుంచెను. కొంత సమయము వెనుక ఈ యొంటెగుడారములోనికి తన దల పెట్టి, „ అయ్యా నాతల ఇంటిలో పెట్టనివ్వండి చాలా చలిగా

యున్నది" అని యడిగెను. "సరే పెట్టుకొనుము"ని అతఁ డనెను. తరువాత "నా నాల్గుకాళ్లుకూడ పెట్టనివ్వండి నిలువలేక యున్నాను" అని అనెను. అతడు దానిని ప్రేమతో చూచుటవలన ఇరుకైనను ఆ విన్నప మంగీకరించెను. మరల, "నా కాళ్లు లోనున్నవి, నా ఒల్లుకూడా యుండ నివ్వండి. కొద్దిచోటుమాత్రమే పట్టును, చలి భరించలేనండి" అని యడిగెను. ఇతడు ఇరుకని సందేహించి ఎట్టికేలకు యొడబడెను. అంత నా ఒంటె లోనికి గంటుకొనివచ్చి, "ఓ యజమానుడా! ఈ ఇల్లు చాలా చిన్నది. నీకు నాకు చాలుట లేదు, నీవు నాకన్న చిన్నవాడవు నేను పెద్దదేహము గలదానను. నీకు చలిపెట్టిన చిన్నదేహముగనుక ఓర్చగలవు నా ఒడలు పెద్దదిగనుక ఎట్లోర్చగలను? గనుక దయచేసి నీవు బయటికి నడువుము అనుచు అతనిని బయటికి త్రోసివేసెను.

కాబట్టి, మిత్రులారా! మీ కేదైన శోధన (కీడు) వచ్చిన దాని మొదటనే త్రుంచండి. లేకపోయిన, ఈ ఒంటె యునికి అయినట్టుగా మించిపోయి మనకు నష్టము కలిగించును. గనుక మెళుకగాయుండండి.

ఇట్లు మీ స్నేహితుడైన

బి. జీవరత్నము

బడిపిల్లవాడు, అమలాపురము

C. L. S. PRESS, MADRAS—1915